

అనగా అనగా ఒక ధనికుడు ఉండే వాడు. అతని పెద్ద ఇల్లంతా అనేక రకాల విలువైన వస్తువులతో నిండిపోయి ఉండేది.

ఆ భవనం చాలక అనేక వస్తువులు వరండాలలో, భవనం బయట పచ్చికలో కూడా ఉండేవి.

తనంత అదృష్టవంతులు కాని వాళ్లకు తన సంపదను ఇచ్చి వెయ్యటం ఆ ధనికుడికి అన్నిటి కంటే ఎక్కువ ఆనందాన్ని ఇచ్చేది. అతడు ఎవ్వరికీ, ఎప్పుడూ కాదనకుండా దానాలు ఇచ్చేవాడు కాబట్టి అతనిది పసిడి గుండె అని దూరదూరాలకు అతని కీర్తి వ్యాపించింది. ప్రతి రోజూ మధ్యాహ్నం అతను బుట్టల నిండా బట్టలు, ఆహారం తీసుకుని తోట లోకి వెళ్లేవాడు. వాటి అవసరం ఉన్న వాళ్లకి వాటిని ఇచ్చేసేవాడు. ఎవరు ఏది అడిగినా కాదనలేకపోయాడు. అతని దగ్గర ఉన్న మంచి పుస్తకాలు, తివాచీలు, రథాలు, మేలిమి జాతి గుర్రాలను ఎవరైనా అడిగితే ఏమాత్రం ఆలోచించకుండా అడిగిన వాళ్లకు అడిగింది ఇచ్చేసేవాడు.

'ఆస్తులు ఎంతో విచారానికి కారణం అవుతాయి,' అతను అనుకునేవాడు. 'డబ్బున్నవాళ్లకి దానిని కోల్పో మన్న భయం ఉంటుంది. పేదవాళ్లకి డబ్బు లేదే అన్న బాధ ఉంటుంది. నాకు ఇన్ని ఆస్తుల అవసరం ఏమిటి? నిర్భాగ్యుల జీవితాలలో ఈ సంపద సంతోషాలను నింపనీ.'





ఈ విధంగా ఆ ప్రాంతంలోని పేద ప్రజలందరూ సహాయం పొందుతూ ఉంటే, ఆ దయామయుడు ఇవ్వటంలోని ఆనందం పొందుతూ ఉండేవాడు. కష్ట కాలంలో ఎవరైనా అతని నుంచి సహాయం పొందవచ్చున్న విషయం అన్ని వైపులకీ వ్యాపించింది. అతని ఖ్యాతి స్వర్గ లోకానికి కూడా చేరింది. ఎత్తైన పర్వతాల కంటే ఎత్తున ఎగిరే దేవతలు ఆ లోకంలో ఉండేవాళ్లు. దేవతల రాజైన శక్ర దేవుడు చాలా శక్తిమంతుడు. భూమి మీద మనుషులను గమనిస్తూ వాళ్ల సాహసాన్ని, నిజాయితీని పరీక్షించటం అంటే అతనికి ఇష్టం.

“ఇతనిది నిజంగానే పసిడి హృదయం అయితే పరీక్షలకు రాటు దేలి అది మరింతగా వెలిగిపోతుంది.

“ఇంతటి ధనవంతుడికి దయా గుణం ఉండటం తేలికే. కొంత సంపద పోగానే అతడు పిసినారిగా మారకపోతాడా, చూద్దాం.”





అదే రాత్రి ధనవంతుడి నగలు, సంగీత వాయిద్యాలన్నీ మాయమైపోయేలా శక్ర దేవుడు చేశాడు. కానీ దయామయుడు దానిని ఏమాత్రం పట్టించుకోలేదు. తివాచీలు, పరదాల దొంతరలు క్రమేపీ తగ్గి పోసాగాయి.

తరవాత బట్టల అరలు ఖాళీ అయిపోయాయి. అయినా దయామయుడు ఇసుమంత కూడా బాధపడలేదు. దయామయుడిలో పిసరంతైనా లోభం కనిపించక పోవటం చూసి శక్ర దేవుడు ఆశ్చర్య పోయాడు.

మరునాడు ఉదయం దయామయుడు నిద్ర లేచేటప్పటికి గాలి ఏదో అంతటినీ శుభ్రం చేసేసినట్టు అతడి భవనంలో ఒక్క వస్తువూ లేదు. ఒక్క గృహోపకరణం కూడా లేదు. వంటి మీద బట్టలు తప్పించి మరొక జత బట్టలు లేవు, ఒక బస్తా ధాన్యం అయినా మిగల లేదు. ఆ గదిలో ఒక కొడవలి, తాడు మాత్రమే ఉన్నాయి.

'చాలా ఆశ్చర్యంగా ఉందే!' దయామయుడు అనుకున్నాడు. 'బహుశా ఏమీ లేని వ్యక్తి ఎవరో రాత్రి వచ్చి అన్నిటినీ తీసుకుని వెళ్లినట్టున్నాడు. అలాగైతే నా సంపద సద్వినియోగం అయినట్టే. అయితే అవసరం ఉన్న వ్యక్తులు నా దగ్గర ఏమీ లేనందువల్ల ఎంత ఇబ్బంది పడతారో. ఈ కొడవలితో పని చేసి ఏదైనా చిన్న సహాయం చెయ్యగలుగుతానేమో.'





అతను కొడవలి తీసుకుని వెళ్లి ఊరిలోని పేద ప్రజల లాగా తన పొలంలో పంట కొయ్యసాగాడు. తనకంటే కూడా ఏమీ లేని వాళ్లు ఎందరున్నారో అనుకుంటూ అతను రోజంతా కష్టించి పని చేశాడు.

‘పేదవాళ్ల బతుకులు ఎంత కష్టంగా ఉంటాయో నేను ఇప్పటివరకు ఊహించ లేకపోయాను. ఆహారం కోసం ఎవరినైనా బిచ్చమడగాలంటే, నా నిస్సహాయతను తలుచుకుని గుండె బాధతో కుమిలిపోతుంది. కానీ, తమ పిల్లల కడుపు నింపటానికి పేదవాళ్లు బిచ్చం అడగక తప్పదు. బలంగా, ఆరోగ్యంగా ఉన్న వాళ్ల సహాయాన్ని జబ్బు పడినవాళ్లు తీసుకోవలసి ఉంటుంది.

‘మనుషులందరూ సంతోషంగా ఉండాలనుకుంటారు, బాధలకు భయపడతారు. అందరం ఒకేలాంటి వాళ్లం, అందరం ఒకటే. నా చుట్టుపక్కల ఇన్ని కష్టాలు ఉన్నప్పుడు నేను సంతోషంగా ఎలా ఉండగలను?’

ప్రజలకు సహాయం చెయ్యాలన్న అతనిలోని కోరిక రోజురోజుకీ బలపడసాగింది. ఆ కారణంగా అతను మరింత కష్టించి పని చెయ్యసాగాడు. ‘నేను మరింత పంట కోస్తే పేద స్నేహితులకు ఏదో ఒకటి ఇవ్వవచ్చు.’

పంట కొయ్యగా వచ్చినది అతడు అవసరమున్న ప్రజలకు ఇచ్చేసేవాడు. ఆకలిగొన్నవాళ్లు, జబ్బుపడినవాళ్లు, కొంచెమే ఉన్నవాళ్లు, ఏమీ లేనివాళ్లు, అబ్బాయిలు, అమ్మాయిలూ, అమ్మలు, నాన్నలూ దయామయుడి దగ్గరకు వచ్చేవాళ్లు. వాళు ఏమీ అడగకుండానే ఒక్కొక్కరికి ఒక్కొక్క నాణెం ఇచ్చేవాడు.

ఆ ముసలి, పేద వ్యక్తి తన దగ్గర ఉన్న డబ్బునంతా ఇతరులకు ఇవ్వటం చూసి బజారులోని వ్యాపారస్తులు విచారంగా తలలు ఊపేవాళ్లు.

“ఓయీ, పిచ్చివాడా. నీ గురించి, నీ కుటుంబం గురించి పట్టించుకోకుండా ఉన్నదంతా ఇచ్చేస్తున్నావే!”

వాళ్ల మాటలు విని దయామయుడు నవ్వుతూ, “వీళ్లంతా నా బంధువులు కాదని ఎవరన్నారు! ఆకలితో అలమటిస్తున్న ఈ పేద, ముసలి మహిళ మరొక సమయంలో, మరొక ప్రదేశంలో నా తల్లి అయ్యుంటుంది.”





అయితే, దేవతల రాజు పరీక్షలు అయిపోలేదు. మబ్బుల మాటునుంచి దయామయుడికి మాత్రమే కనపడుతూ, అతను ఇలా అన్నాడు,

"మూర్ఖుడా! దానం చెయ్యాలన్న నీ స్వభావాన్ని అదుపులో పెట్టుకో! నీ దగ్గర మళ్లీ సంపద పోగుపడినప్పుడు మరిన్ని దానాలు చెయ్యవచ్చు. నీ దగ్గర ఏమీ లేనప్పుడు ఇవ్వకపోవటం నేరం ఏమీ కాదు."

దానికి దయామయుడు ఇలా బదులిచ్చాడు, "శక్ర దేవా, నేను మీరు చెప్పినట్టు చెయ్యలేను. నా చుట్టుపక్కల ప్రజలు ఎంతో కష్టాలలో ఉన్నారు. ఒక పేద వ్యక్తి ఆకలితో ఉండి, ఈ రోజు నన్ను సహాయం అడిగితే నా దగ్గర సంపద పోగుపడిన తరవాత రమ్మని అతనికి చెప్పలేను కదా! ఇతరులకు సహాయం చెయ్యాలనుకునే వ్యక్తి ఆ అవసరం ఉన్నప్పుడు తన శక్తి కొద్దీ సహాయం చేస్తాడు. నేను దానం చెయ్యటం వల్ల ఇతరులకు మేలు జరుగుతుంది, నాకు సంతోషం లభిస్తుంది. కాబట్టి నేను దానాలు ఆపలేను."



ఎట్టకేలకు శక్ర దేవుడికి నమ్మకం కలిగింది. “నీ స్వభావం స్వచ్ఛమైనదీ, ధృఢమైనదీ అని నాకు అర్థం అయ్యింది. స్వార్థ భావనలు అనే చీకటి మబ్బులను తొలగించటం వల్ల నీ హృదయ సూర్యుడు దేదీప్యమానంగా ప్రకాశిస్తున్నాడు.

నువ్వు ధనికుడివి అయినా, పేదవాడివి అయినా నీ పసిడి హృదయం మాత్రం అలాగే ఉంది. కొండని గాలి కదిలించలేనట్లే నీ స్వభావాన్ని నేను మార్చలేను అని తెలిసింది. నేను చేసిన పని నీకు చెప్పాలి.”

శక్ర దేవుడు తన చేతిని గాలిలో అలా ఆడించగానే దయామయుని సంపదలు అన్ని తిరిగి వచ్చేశాయి. ఒక్క నగ కూడా పొల్లుపోకుండా, వంట సామానుల గదిలో ఒక్క దినుసు కూడా తక్కువ కాకుండా అన్నీ ఎప్పటిలాగే ఉన్నాయి.

"నీ సంపదనంతా నేనే మాయం చేశాను. అందుకు నన్ను క్షమించాలి. వాన మబ్బులు వర్షాన్ని కురిపించనట్టే ఇక నుంచి నువ్వు దానాలు చేస్తూ ఉండు."

ప్రపంచంలోని ప్రతి ఒక్కరిని ప్రేమించేటంతగా దయామయుడు తన దాన గుణాన్ని పెంపొందించుకున్నాడు. దానం చెయ్యటమే సంతోషానికి మార్గమని అతను తెలియచేశాడు.

దయగల హృదయం ఉంటే మీ సంతోషం నిజమైనదిగా ఉంటుంది. మీరు ఇతరులకు సంతోషాన్ని పంచితే అది తప్పనిసరిగా మీ దగ్గరకు తిరిగి వస్తుంది!

